Islam ki Ahmiat
Hindu Dharma ke Pasmanzar me
(Telugu)

# ఇస్లాం ప్రాముఖ్యత - హిందూ ధర్మం దృష్ట్యా


రచన
ముహమ్మద్ ఫారూఖ్ ఖాన్

అనువాదం
ముహమ్మద్ గౌస్‌మొహియుద్దీన్

# విషయ సూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# పరిచయం

"ఇస్లాం ప్రాముఖ్యత - హిందూ ధర్మం దృష్ట్యా" అనే ఈ పరిశోధనా వ్యాసం ముస్లిం యూనివర్సిటీ, ఇస్లామిక్ స్టడీస్ విభాగపు ఒక ప్రత్యేక కార్యక్రమంలో భాగంగా అలీగఢ్‌లో వినిపించబడినది. ప్రస్తుతం దీనిని సార్వజనిక ప్రయోజనార్థం పుస్తక రూపములో ముద్రింపబడినది. హిందూ ధర్మముతో సరిపోలికలో ఇస్లాంకు విస్పష్టమైన గుణగణాలున్నవి. వాటిని ఈ చిరుపుస్తకములో చర్చించే ప్రయత్నం చేయడమైనది. ఈ దేశంలో ఒక ప్రాచీన మతాన్ని, సంస్కృతిని కలిగి ఉన్న వారము, తామేనని గర్వపడే జాతికి కూడా ఈ ధర్మము ఆవశ్యకత ఎంతో ఉన్నది. ఇస్లాంకు లభించిన ప్రత్యేకతలు మరియు విశిష్టతలే ఇందులకు ప్రస్ఫుటమైన నిదర్శనములు.

మన తోటి సోదరులకు సత్యధర్మ సందేశాన్ని చేరవేయడమే సర్వోన్నతమైన ధార్మిక భాధ్యతగా భావిస్తూ క్రియారంగములో కృషిచేస్తున్న కార్యకర్తలకు ఈ పుస్తకం తప్పనిసరిగా సహకరించగలదని ఆశిస్తున్నాను.

– ముహమ్మద్ ఫారూఖ్ ఖాన్

# ఇస్లాం ప్రాముఖ్యత - హిందూ ధర్మం దృష్ట్యా

హిందూ ధర్మము అనగా ఏమి? ఇది ఒక కష్టతరమైన ప్రశ్న. ఇచ్చట అందరూ అనుసరించుటకుగాను ఒక గ్రంథము లేదు లేక ప్రవక్తయు లేరు. మత సిద్ధాంతముల స్థితి కూడా అలాగే కలదు. హిందూ ధర్మము దృఢమైన మత సిద్ధాంతాలు కలిగిన ఒక ధర్మమేమీ కాదు. మత సిద్ధాంతాలు ఆచారాలు, ఆచరణల విషయంలో ప్రజలకు విపరీతమైన స్వాతంత్ర్యము కలదు. ఈ కారణంగానే కొందరు హిందూ ధర్మాన్ని మత విశ్వాసాల సిద్ధాంతాల మ్యూజియంగాను లేక వివిధ రీతుల ఎన్‌సైక్లోపీడియాగా అభివర్ణిస్తారు. హిందూ ధర్మ వ్యవస్థాపకుడంటూ ఎవరూ లేరు. ఇందుకు వ్యతిరేకంగా దీని స్వరూప నిర్మాణములో ఒక గొప్ప సమూహం పాల్గొన్నది. ఈ ధర్మానికి ఏదైనా ప్రత్యేకమైన మూలగ్రంథము (text) కూడా లేదు. మరి ఒక వేళ ఉన్నా అది మారుతూ వస్తున్నది.

డా॥ సర్వేపల్లి రాధాక్రిష్ణన్ ప్రకారం– హిందూ ధర్మాన్ని ఏదేని ఆలోచన సిద్ధాంతపూరితమైనదిగా భావించుటకు బదులుగా దానిని జీవనాన్ని గడిపే ఒక పద్ధతిగా చెప్పుట ఎంతో సమంజసముగా ఉంటుంది. ఇది భావనలతో అభిప్రాయాల ప్రపంచంలో ప్రజలకు సంపూర్ణమైన స్వేచ్ఛను కల్పిస్తున్నది. కానీ ఇది దేశపు ఆచార వ్యవహారాల నియమావళిని తప్పనిసరిగా అనుసరించ వలెనని కోరుతున్నది. డాక్టర్ గారి దృష్టిలో నాస్తికుడైనను, ఆస్తికుడైనను

అందరూ హిందువులుగా పిలువబడే హక్కును పొంది ఉన్నారు. ఇందుకు ఆయన విధించే షరతు ఏమనగా, అతడు హిందువుల సంస్కృతి, వారి జీవన పద్ధతులను అనుసరించవలెను. హిందూ ధర్మము అన్ని విధములైన మత భావనలు, అభిప్రాయముల మరియు విభిన్న ఆచార వ్యవహారాల మిశ్రమమని డా॥రాధాక్రిష్ణన్ అంగీకరించారు.

కానీ వారు దీనిని అభిలషణీయమైనదిగా భావిస్తున్నారు. అనగా దీని వలన ధర్మములో అన్ని రకాలైన వ్యక్తుల అవసరాలను, వారి కోరికలకు తగిన గౌరవము ఇవ్వడమైనదని ఆయన భావిస్తున్నారు. ఉదాహరణకు, వ్యక్తి దైవం విషయంలో ఎలాంటి విశ్వాస సిద్ధాంతము రూపొందించుటను లేదా ఆతనికి నచ్చిన దానిని ఈ ధర్మము నిస్సంకోచంగా తనలో స్థానాన్ని కల్పిస్తుంది.

బహుశా గాంధీ గారికి హిందూ ధర్మపు క్లిష్టతలు, చిక్కుల గురించి అవగాహనతో ఇలా అన్నారు. "నిశ్శబ్ధంగా సత్యాన్ని వెతుకుతూ ఉండటమే హిందూధర్మమని" చెప్పేవారు.

## చారిత్రక పూర్వాపరాలు

భారత దేశంలో వైదిక ధర్మపు కాలాన్ని సుమారు క్రీ.పూ1500 నుండి క్రీ.పూ.400 గా భావిస్తారు.(మరోవిధంగా) వేదాలలో బౌద్ధము మరియు జైన మతాల యొక్క ప్రజా బాహుళ్యంలో ప్రాచుర్యపు కాలము వరకు వైదిక మతానికి ఆధిక్యత లభించినది. హిందూ ధర్మపు కాలము వైదిక కాలాంతం తరువాత ప్రారంభమైనది. బ్రాహ్మణవాద పునరుజ్జీవనం అనగా పురాణాలపై ఆధారపడిన హిందూ ధర్మపు ఉత్థానకాలము (కీ.పూ.400) వరకు. యుద్ధ వృత్తాంతము గల గేయాల లేక రామాయణం మరియు మహాభారతముల కాలంగా చెప్పబడుతున్నది. రామాయణం, మహాభారతము కంటే అధికంగా నాగరికమైన మరియు అభివృద్ధి చెందిన నైతిక నియమాలు అనుసరిస్తున్న

సమాజాన్ని ప్రతిబింబింపజేస్తున్నది. వీటిని ఆధారంగా చేసుకొని ఊహిస్తే రామాయణపు ముఖ్య ఘట్టాలు మహాభారతం తరువాతి కాలానికి సంబంధించినవిగా తెలుస్తున్నది. వాస్తవానికి రామాయణాన్ని సాధారణంగా మహాభారతం కంటే పురాతనమైనదిగా భావించడం జరుగుతున్నది.

మహాభారతం మరియు రామాయణం హిందూ ధర్మపు పురాతన గ్రహితములు. వీటిలో హిందూ ధర్మపు ప్రధాన భేదములు ఉదాహరణకు వైష్ణవ మతము, శైవ మతము మరియు శక్తి మతము మొదలగునవి. మరి హిందువుల ప్రఖ్యాతి గాంచిన దేవి, దేవతల స్పష్టమైన ప్రస్తావన లభిస్తుంది. వేదములతో హిందూ సమాజపు సంబంధము కేవలం చారిత్రకమైనదిగా ఉండిపోయినది.

వేదాలు నాలుగుగా విశ్వసించడమైనది. ఛందోబద్ధ ( పద్యములుగా వ్రాయబడిన ) రూపములో ఉన్నటువంటి వేదముల మంత్రములను "రిచా" అంటారు. రిచముల సమూహమే ఋగ్వేదములో కలదు. "యజుష్" అనగా గద్య రూపములో ఉన్నందున ఈ వేదం పేరును "యజుర్వేదము"గా ఉంచబడినది. "సామ్" అనగా గీతము లేక సంగీతంలో ఉన్న కారణాన మూడవ వేదము "సామవేదము"గా చెప్పబడుతున్నది. ఋషులు రిచములను సంగీతంలోనికి రూపాంతరం చేసే కార్యాన్ని కూడా చేశారు. సామ వేదములో లభించే మంత్రములు కొన్ని మినహా తక్కిన మంత్రములన్నీ ఋగ్వేదంలో ఉన్నవే కలవు.

నాలుగవ వేదము "అధర్వణవేదము". ఇది వేదములలో ఒక భిన్నమైన విశిష్టత కలది. అధర్వణ వేదములో దేవతలకు అధికంగా ప్రాముఖ్యత నివ్వక, జీవితమునకు సంబంధించిన రోజువారీ వ్యవహారములను గూర్చి చర్చించడమైనది. ఋగ్వేదము సుమారు నాలుగు వందల యాభై సూక్తులలో అనగా ఋగ్వేదపు అర్ధ భాగం ఇంద్రుడు మరియు అగ్ని దేవతల రూపంలో వ్యాపించి

ఉన్నది. కానీ అధర్వణ వేదములో వారికి ఈ ప్రాధాన్యత లభించలేదు. అధర్వణ వేదములో రోగములకు చికిత్స గురించిన ప్రస్తావన కలదు. మంత్రముల సంఖ్య చాలా అధికముగా ఉన్నది. అంతేకాదు వివిధ రోగములు మరియు వాటి ఔషధముల పేర్లను ఇందులో తెలుపబడినవి. భవన నిర్మాణము, వ్యవసాయము, వ్యాపారమునకు సంబంధించిన ఎన్నో సూక్తులు అధర్వణ వేదంలో కలవు. వీటిలో మనము కవితాత్మక భావుకతలతో తేలియాడే అవకాశం లభిస్తుంది. వీటితో పాటు కొన్ని తాత్విక భావనల (ఉదాహరణకు కాలసూక్తము) కూడా మనకు పరిచయం అవుతుంది.

వేదవ్యాసుడు నాలుగు గ్రంథాలలో వేద మంత్రములను సేకరించి వ్రాసెను. ఈ వేద మంత్రములు వివిధ ఋషుల ద్వారా సృష్టించబడినవి. ఇవి సృష్టించబడిన కాలము మూడు వేల సంవత్సరాల వరకు వ్యాపించి ఉన్నది. నాలుగు వేదములలోని మంత్రములను సంకలితము జేసిన తరువాత మంత్రములేవీ వ్రాయబడలేదు. దీనిని స్వీకరించుట చాలా కష్టము. వేదముల లోని కొన్ని చివరి మంత్రములు తరువాత కాలము నాటి సృష్టితంగా తెలియు చున్నవి. ఋగ్వేదంలోని ఎనిమిదవ మండలంలో చివరన ఉన్న పదకొండు సూక్తులు ఈ వేదము సహజమైన భాగము కాదు. ఇవి తత్వశాస్త్రమునకు సంబంధించిన సూక్తులు, వీటిని వైదిక కాలం నాటి చివరి దశాబ్దంలో సృజింపబడినవిగా అభిప్రాయం కలదు. ఉదాహరణకు, పురుష సూక్తము, హిరణ్య గర్భ సూక్తి, సృష్టి సూక్తి, వాక్ సూక్తి, కాల సూక్తి మొదలగునవి ఈ చివరి కాలపు సూక్తులే.

వైదిక కాలపు మూడువేల సంవత్సరముల చివరి దశాబ్దములో కురుక్షేత్రములో అర్జునుడి మరియు శ్రీకృష్ణుని మధ్య జరిగిన సంభాషణలలో ఈ విధమైన తాత్వికమైన సూక్తుల ప్రతిబింబం ప్రస్ఫుటంగా దర్శనమిస్తుంది. ఈ సంభాషణలు “గీత” అనే పేరుతో పిలువబడుచున్నాయి.

"గీత" లో విభిన్నమైన అభిప్రాయాలు మరియు ఆలోచనలను క్రోడీక రించే ప్రయత్నం జరిగినది. ఇవి దేశపు వివిధ ప్రాంతాలలో మరియు వివిధ తెగలలో లభించేవి. 'గీత' తరువాత "బ్రాహ్మణ" గ్రంథముల సృజన ఆరంభమైనది. వాటిలో కర్మకాండము ( ఆచారములు మరియు వ్యవహారములను ప్రత్యేక పద్ధతిలో ప్రవేశ పెట్టేందుకు ప్రయత్నం జరిగినది. దీనితో పాటు "ఆరణ్యకములు" ఉపనిషత్తులలో ప్రస్ఫుటముగా, ప్రత్యక్ష పద్ధతిలో తాత్వికమైన ఆలోచనలను సాధారణ భాషలో, ప్రభావవంతమైన పద్ధతిలో ప్రవేశపెట్టబడినవి. తత్వ జ్ఞానము పై ఎంతగా శ్రద్ధ పెరిగినదంటే యజుర్వేదములోని చివరి కాండములో బలీయమైన తాత్విక ఆలోచనలు లభిస్తాయి.

వాటిని నియమానుసారం 'ఈశోపనిషత్తుగా' నామకరణం చేసి విడిగా పుస్తక రూపాన్ని కల్పించడమైనది. వేదాలను కొందరు హిందూ పండితులు దైవవాణి లేక వాక్కుగా భావిస్తారు. కానీ ఈ ఆలోచనను సమర్ధించుట చాలా కష్టము. అయినప్పటికి (ఆకాశ) దైవిక జ్ఞానపు ప్రభావపు ప్రతిబింబం వేదాలలో తప్పక లభిస్తుంది. ఒకవేళ వేదాలు దైవిక గ్రంథాలైనను నేడు అవి ఏ రూపంలోనైతే లభిస్తున్నాయో, వాటిని దైవిక గ్రంథాలుగా పేర్కొనలేము

## వేదాంతములు

హిందువులకు వేదాంతముల తత్వముపై గర్వము కలదు. ఈ గర్వము నిరాధారమైనది కూడా కాదు. కావున ఇక్కడ వేదాంతములను గురించి కొన్ని ఆవశ్యకమైన విషయాలు తెలుపుచున్నాము. ఉపనిషత్తులు వాస్తవానికి వైదిక సాహిత్యపు చివరి అంశము. ఉపనిషత్తుల అసలు అంశము వేదాంతములే. ఉపనిషత్తులు 108 నుండి 200 ఉన్నవని పేర్కొనబడుతున్నవి. ముక్తక ఉపనిషత్తులో వీటి సంఖ్య 160 గా వెలుపబడినది. వాటిని పేర్లతో

సహా గుర్తించడమైనది. వీటిలో 14 ఉపనిషత్తులు చాలా ప్రాముఖ్యం కలిగిన విగా భావింపబడుతున్నవి. ఉపనిషత్తుల పఠనం నేడు కూడా చేయబడు తున్నది. ఇవి ఆనందదాయకమైన జీవనం కొరకు అవసరమయ్యే తాత్విక భావనలను కలిగి ఉన్నవనే విషయంలో ఏలాంటి సందేహం లేదు. ప్రస్తుత కాలపు ప్రఖ్యాతి గాంచిన తాత్వికవేత్త అయిన షెల్లింగ్ (shelling) షోపెన్ హార్‌లు(Schopenhauer) ఉపనిషత్తులతో అసాధారణ రీతిలో ప్రభావితు లయ్యారు.

దేవతల అస్థిత్వము గురించి సంశయిస్తూనే చివరకు ఇంద్రుడు, వరణుడు, మిత్రుడు మొదలగునవి వాస్తవానికి ఒకే శక్తికి సంబంధించిన వివిధ గుణ నామములనే సత్యాన్ని పొంది వారు ఇలా ప్రకటించారు.

**"ఏకం సద్ విప్రా బహుధా వదంతి!" (ఋగ్వేదం: 46-164-1)**

"వాస్తవమునకు ఒక్కడే జ్ఞాని, లోకులు అతని ఎన్నో పేర్లు గలవాడిగా పిలుస్తున్నారు."

ఉపనిషత్తులు లేక వేదాంతముల మూల బోధనలు ఏమనగా ఒకే బ్రహ్మ సర్వ సృష్టిని వ్యాపించియున్నాడు. లేదా సర్వసృష్టి అంతయు బ్రహ్మయే. ఋగ్వేదము పురుష సూక్తములో చాలా స్పష్టమైన పద్ధతిలో చెప్పబడినది.

## పురుష వేదం సర్వం!

**"ఇవి అన్నియు పురుషుడే!" (ఋగ్వేదం: 2:90:10)**

ఉపనిషత్తు ప్రకారము బ్రహ్మ ఆత్మ అనంతమైన అస్థిత్వము కలవి. ఉపనిషత్తులలో దుష్క్రియల నుండి దూరంగా ఉండేందుకుగాను ఎంతో ఉన్నత మైన, అమూల్యమైన విషయాలు చెప్పబడినవి. వీటిలో సర్వగౌరవోన్నతులు గల అస్థిత్వము కేవలం నీతియే. దానిని నీతి (That is not, that is not) ద్వారానే పొందగలమనే విషయాన్ని తెలియపరచడమైనది. ఈ సందర్భంలో

దీనిని నిర్గుణ బ్రహ్మ (నిరాకారుడైన సృష్టికర్త) రూపములో స్మరించడం జరిగినది.

ఉపనిషత్తుల మూలము అంతర్ జ్ఞానము (intution) గానున్నది. ఆ తరువాత దీనిని తాత్విక పద్ధతిలో ప్రవేశ పెట్టబడినది. దీనిన్నే వేదాంతము లుగా పేర్కొనడమైనది. మరలా స్వయంగా ఉపనిషత్తులకు కూడా వేదాంత ములు అనే పదాన్నే ఉపయోగించబడినది. సాంఖ్య, యోగముల మూలం కూడా ఉపనిషత్తులపైననే ఉంచబడినది.

చెప్పబడిన విషయము ఏమనగా, ఋగ్వేదపు ఋషివర్యులు అవ్యక్తవాస్తవము (Ultimate Reality) కొరకు అన్వేషణలో ఉండేవారు. దానిని చివరకు ఉపనిషత్తుల ఋషులు ఇలాః

> **"ఈ మనస్సు సులభగ్రాహ్యమైన మరియు లభించిన దానితో తృప్తి నొందలేదు. నా జ్ఞాన పరిధికి వెలుపల ఎవరైనా ఉంటే బాగుండును కదా!"**

అయిననూ మరలా మనస్సు కోరేదేమంటే ఆయనతో ఏదో ఒక సంబంధము కలిగి ఉండాలి, అది కూడా చాలా చేరువైనదిగా.

> **"ఈ ప్రపంచమునకు వెలుపల కూడా నేను ఉన్నాననే భావన కలుగుతున్నది.నా ముఖారవిందంలో ఎవరి కలల ప్రతిబింబము, నున్నదో."**

## వేదాంత సూత్రములు (బ్రహ్మే సూత్రములు)

ఉపనిషత్తుల సారాంశములలో కూడా భేదాభిప్రాయములు కలవు. ఈ భేదాభిప్రాయములను పారద్రోలుటకుగాను బాద్రాయణుడు "బ్రహ్మే సూత్రములు" అనే శీర్షికతో కొన్ని సూత్రములు క్రోడీకరించెను. ఇవి మొత్తము 555 సూత్రములు. అనగా బ్రహ్మసూత్రములు 555 సూత్రముల సంపుటము.

బ్రహ్మ సూత్రముల ద్వారా పైన తెలిపిన విధముగా ఉపనిషత్తులలో పొంతన మరియు ఒకదానికి మరొక దానికి మధ్య సంబంధమును పెంపొందించే ప్రయత్నము చేయడమైనది. వాటిలో గల పరస్పర వ్యతిరేక బోధనలను తగు కారణములను తెలియపరుస్తూ సమాధాన పరచడమైనది. ఏదిఏమైనను బాద్రాయణుడు ఎంతవరకైతే గ్రహించాడో ఆయా విషయములపై చర్చ జరిగే వెసులుబాటు నిస్సందేహంగా మిగిలి ఉంటుంది. మునుముందుకు వెళ్లినచో శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు తదితర పదిమంది ఆచార్యులు కూడా బ్రహ్మ సూత్రములపై తమతమ విశ్లేషణలను వ్రాశారు. వీరందరునూ తమ తమ అభిప్రాయాలు, ఆలోచనల ప్రకారం బ్రహ్మ సూత్రములను విశ్లేషించారు.

ఉపనిషత్తులు, ప్రత్యేకించి బ్రహ్మసూత్రముల విశ్లేషణకర్తలను మనము నాలుగు వర్గములుగా విభజించగలము.

**1. హమ అజ్ ఊస్త్ సిద్ధాంతమును అనుసరించు వారు.**

**(సృష్టితములన్నియు దేవుని నుండియే)**

**2. హమ బావోస్త్ సిద్ధాంతమును అనుసరించువారు.**

**3. హమ ఊస్త్ ( షహదీ) సిద్ధాంతమును అనుసరించువారు. (అన్నియు దేవుడే)**

**4. హమ ఊస్త్ ( వజదీ) సిద్ధాంతమును అనుసరించువారు.**

హమ అజ్ ఊస్త్ అర్థమేమనగా భూతములు మరియు సృష్టితములు ( ప్రాణులు) అన్నియు స్వయంగా నిలిచియున్నవి. ఇవి అసహ్యామైనవి కావు. ఇందుకు భిన్నముగా అవి భూమి నుండి సృజించబడినవి. అనగా సృష్టితములన్నియు ఆ సవ్యస్వరూపుని నుండి వేరు చేయబడినవే. ఈ సిద్ధాంతము శ్రీ మాధవాచార్యుల వారిది. ముస్లిములలో 'ముతకల్లిమీన్' ల సిద్ధాంతము కూడా ఇదే.

2. హమ బావోస్త్ సిద్ధాంతముననుసరించి; సంభవములన్నియూ సర్వోన్నతుడైన సత్యస్వరూపుని వెంట నిలచి యున్నవి. అవి స్వయంగా స్థాపించబడలేదు. సంభవములన్నింటి స్థాయి అసహ్యములైనటువంటివి. ఉదాహరణకు అసలు తలమే (Surface) లేనప్పుడు మనము త్రిభుజమును ఊహించలేము. ఏదేని చతుర్భుజము లేదా దీర్ఘ చతురస్రముల ఉనికే కనుగొనలేము. ఈ సిద్ధాంతము శ్రీ భాస్కరా మరియు శ్రీ వల్లభాచార్యులది.

*3.* హమ ఊస్త్ *( షహదీ)* అర్థమేమనగా, వాస్తవమైన అర్థములో సత్య స్వరూపమైన అస్థిత్వమే నిలచియున్నది. సంభవముల అస్థిత్వము వాస్తవమైనది కాదు. అనగా అది 'ఛాయ' లాంటిది. వీటి స్థానము కేవలం ఒక నీడ వంటిదే. ప్రతి వస్తువు కూడా సత్యము నుండి వెలువడినదే. ప్రతి వస్తువు సాక్ష్యముగానున్నది. ప్రతి వస్తువులోను దాని సాక్షాత్కారము కలదు. ఈ సిద్ధాంతము హిందువులలో శ్రీ రామానుజాచార్యులది ముస్లిములలో 'వహ్దతు ష్షహూద్" (సృష్టితములన్నియు) ఈ ప్రపంచములో కానవచ్చే వస్తువులన్నీ అల్లాహ్ నీడయే లేక ప్రతిబింబములే అనే సిద్ధాంతము ననుసరించు వారు ముజద్దిద్ అల్ఫ్-ఎ-సానీ షేఖ్ అహ్మద్ సర్ హిందీ (ర.అలై). పాశ్చాత్య తత్వశాస్త్రములో బర్కిలే తన తాత్విక వాదనలో ఈ సిద్ధాంతమునే బలపరుస్తున్నట్లుగా కనిపిస్తాడు.

*4.* హమ ఊస్త్ *( వజదీ)* ననుసరించి వాస్తవమైన అర్థానుసారం ఉన్న అస్థిత్వము కేవలం సత్యమే. సృష్టితముల అస్థిత్వం కేవలం భ్రాంతితో కూడినటువంటిది. అనగా ఆలోచనా సరళి యొక్క మతము వీటిని 'ఛాయ'కు బదులుగా 'మాయ'తో పోల్చబడమైనది. ఈ భ్రాంతికరమైన అస్థిత్వము ఎలాంటిదనగా, అత్యంత వేగవంతమైన అగ్నిజ్వాల భ్రమణం వల్ల జనించే వృత్తము లాంటిదై ఉంటుంది. ఇది మనకు కనబడుతుంది. కానీ వాస్తవానికి దానికి ఎలాంటి అస్థిత్వము ఉండదు. అక్కడ కేవలం అగ్ని మాత్రమే

ఉంటుంది. ఈ అద్వైత వాదమును హిందువులలో శ్రీ శంకరాచార్యుల వారు ఎన్ను కున్నారు. అలాగే ఇస్లాం అనుయాయులలో మొహియుద్దీన్ ఇబ్నె అరబీ(ర.అలై) వారి సిద్ధాంతము కూడా ఇదే.

ఒకే అస్థిత్వం నుండి విభిన్న జీవుల ఉధ్భవనం అనే పద్ధతిలో జరిగినది. దీని వలన ఆ అద్వితీయమైన అస్థిత్వంలో ఎలాంటి లోపము లేదా దోషము గాని ఏర్పడదు. అద్వితీయమైన ఆ అస్థిత్వము మనలోకి పరివర్తితము కానేరదు. ఇందుకు భిన్నంగా శాశ్వతంగా అత్యంత దూరమై ఉంటుంది. శ్రీ శంకరాచార్యుల వారు ఇదే అంటున్నారు. శరీరము వృద్ధి చెందుతుంది కాని అది నిలకడ లేనిది. అది నిరంతరము భవిష్యత్తులో ఏర్పడబోయే స్థితిలో ఉంటుంది.

ఇక్కడ (ఇస్లాం ప్రకారం) 'కున్ - ఫయకున్" (అయిపో, అనగానే - అయిపోయాను) అనే నినాదం ఎల్లప్పుడు వినబడుతుంటుంది. బ్రహ్మ అస్థిత్వం స్వయంభవము, ఇందులో అది ఎవరిపైనను ఆధారపడి లేదు. విశ్వపు అస్థిత్వము సాధ్యపూర్వకమైనది. విశ్వాన్ని చూచినచో అది ఉన్నట్లుగానే కనబడును కానీ పరీక్షించినచో దాని అస్థిత్వమును మనం పొందలేము అని చెబుతుంటారు.

'ఒక్క ఆయన ఉనికి తప్ప, ప్రతిదీ నశించేదే.' ( సూర ఖసస్: 88 )

ఉపనిషత్తుల కాలపు సంస్కృతి, వైదిక కాలపు సంస్కృతితో భిన్న మైనది. ఉపనిషత్తులలో వాస్తవ ప్రాధాన్యత ఆత్మ ( రూహ్ ) కు ఇవ్వడమైనది. కర్మకాండము అనగా బాహ్యాపరమైన సాంప్రదాయాలు, ఆచారాలకు బదులుగా ధర్మము 'చిన్తన్ మనన్" ఆలోచించటము, ధ్యానించటము, నిధ్యాసనపు రూపమును సంతరించుకొన్నది. నిధ్యాసనము అర్థము నిరంతరము ఆలోచించటము, ధ్యానము చేయటం. ఇక్కడ మత సిద్ధాంతము లేదా ఆచరణలకు బదులుగా జ్ఞానము లేక తెలివిని, ముక్తిమోక్షాలకు

కారణంగా నిర్ణయించడమైనది.

"జ్ఞానాగ్ని సర్వ కర్మణనీ భస్మసాత్!"

**"జ్ఞానము యొక్క జ్వాలలు సర్వకర్మలను దహించి భస్మము చేస్తాయి."**

హిందూ ధర్మం కాలము ముందుగా పేర్కొన్న విధముగా వైదిక కాలపు అంతం తరువాత ప్రారంభమౌతుంది. హిందూ ( సంప్రదాయాల ) ధర్మ కథనములు వాస్తవానికి వేదముల సర్వాధికారము నుండి స్వేచ్ఛ పొందిన తరువాత వృద్ధి చెందినవి. ఒకవేళ వేదములతో ఏదైనా సంబంధం ఉన్నా అది కేవలం నామమాత్రమే. హిందూ ధర్మం మూలము, యుద్ధ వృత్తాంతపు గేయముల కాలము నుండి ఉత్థానము పొంది పురాణముల కాలములో తన ఉచ్ఛ స్థాయికి చేరిన విభిన్న మతాభిప్రాయములు మరియు ఆచారములపై స్థాపించబడి ఉన్నది. అంతిమ వైదిక కాలపు సాహిత్యములో 'బ్రహ్మ'ను వాస్తవమైన సర్వోన్నతుని అస్థిత్వమునకు సమానుడైన అద్వితీయుడు అందరికంటే ఘనమైన దేవునిగా పేర్కొనడమైనది. కానీ మహాభారతము రామాయణములలో కేవలం విశ్వసృష్టికి కారణభూతుడిగా మాత్రమే ఆయనకు స్థానమివ్వబడినది. అంతేకాదు బ్రహ్మ, విష్ణువు మరియు శివుల త్రిత్వపు దైవత్వంలో బ్రహ్మ స్థానం, ఆయన ఉనికి వాస్తవానికి మరుగునపడుతూ పోయినది. దైవత్వపు భక్తి భావన సిద్ధాంతములన్నీ కేవలం విష్ణువు మరియు శివులతోనే అనుబంధింపబడినవి. వీటితోపాటుగా ఒక దేవీమాత రూపాన్ని కూడా వాస్తవమైన సర్వోన్నత దైవంగా నెంచి ఆరాధించుట భారతదేశపు ఒక పురాతన సాంప్రదాయము.

పురాణములు హైందవ కథనములలో అన్నిటికంటే చివరిదైన పవిత్ర రచనలు. వాస్తవానికి వీటి స్థానము పురాతన కథానికలపై ఆధారపడిన సాంప్ర దాయాల ద్వారా హిందూ ధార్మికత మూలములను దృఢ పరిచే ప్రయత్నం జరిగినది.

## హిందూ ధర్మపు ధార్మిక సిద్ధాంతములు

హిందూ ధర్మపు ధార్మిక సిద్ధాంతములను పరిశీలించిన పిదప వాటిని ఈ క్రమపద్ధతిలో వ్రాయగలము :

1. దేవునిపై విశ్వాసం కలదు, కానీ మానవుని పూర్తి జీవితాన్ని ప్రభావితం చేయగలం. దానిని సంపూర్ణంగా మార్చివేసే విశాలమైన ఏకేశ్వరవాద భావన ఇందులో లేదు.

2. దేవునిపై విశ్వాసంతో పాటు బహుదైవారాధనపు మత సిద్ధాంతములు విగ్రహారాధనపు భావన కలగలిపిన ఆచారాలు, ఆచరణలకు కూడా సాధారణమైన అనుమతి కలదు. భూత–ప్రేతముల పూజలతో పాటు, పితృ దేవతల పూజ, దేవీ, దేవతల ఆరాధన శక్తి పూజను కూడా యోగ్యమైనదిగా ఉంచటమైనది. బలహీనమైన బహుదైవారాధనపు ఆచరణ, అద్వితీయుడైన ఆ సర్వేశ్వరుని నుండి లేశమంత పరిచయం కూడా లేని వారుగా ప్రజలను చేసినది. సర్వసృష్టి పరిపాలకుడు, అధికారి సర్వాధికారాలకు యజమాని, గౌరవనీయుడైన పరమేశ్వరుడున్నాడు. మిగిలిన వారందరు ఆయనకు లోబడి ఉన్నారు అనే ధార్మిక భావన కూడా వెలిబుచ్చబడినది. ఇంకొక సమూహం "తత్వవాదము"ను అనుసరించే వారు కలరు. వీరు కర్మకాండములు, వర్ణ ఆశ్రమము, పూజా వ్రతములు (రోజాలు), తీర్థము, మందిరములు తదితర వాటికి ప్రాముఖ్యతనివ్వరు. వీరు దేవుని అస్థిత్వమును స్వీకరించరు. మానవుడు "విశ్వతత్వము" అనగా విశ్వపు వాస్తవిక ఆత్మ జ్ఞానాన్ని పొంది ముక్తి–మోక్షములకు అర్హుడు కాగలడు. ఇందుకు మానసిక పరిశుద్ధత మరియు సదాచరణలు చాలును.

3. విగ్రహారాధన అనుమతించబడినది. కానీ క్రీ.పూ.సుమారు 300 వరకు భారతదేశపు ఆర్యులలో విగ్రహారాధనా పద్ధతి చలామణిలోలేదు. క్రీ.శ.650 నుండి దేవతలతో పాటు దేవీ ఆరాధనా ఆచారము కూడా వాడుక

లోకి వచ్చినది. ఆదిలో కేవలం దేవతల ఆరాధన జరుగుచుండెను. వారిలో శివుడు మరియు విష్ణువులకు ప్రత్యేక స్థానము ఉండినది.

4. అవతారవాదమును స్వీకరించడమైనది. భారతదేశములో దైవదౌత్య భావన (దైవప్రవక్తల ఆవిర్భావ భావన) లభించదు. ఈ భావన ఎంతగా చెరపి వేయబడినదంటే, అసలు దైవదౌత్యభావన అనార్యుల భావనగా తెలుస్తున్నది. దైవదౌత్యం స్థానములో ఇక్కడ ఏ సిద్ధాంతమునకు అభివృద్ధి అయ్యే అవకాశం లభించిందంటే అది అవతారవాదపు మతసిద్ధాంతమే. సంస్కృతములో పై నుండి క్రిందకు (ఆరోహణ) దిగుటను "అవతార్" అంటారు. "అవతార్" పదము నుండి ఈశ్వరుని దిగుటను ఉద్దేశింపబడినదిగా తీసుకుంటారు. అనగా ఎప్పుడైతే లోపరహితుడైన అస్థిత్వము, స్పష్టమైన రూపములో మన కన్నుల ఎదుట ప్రత్యక్ష్యమౌతాడో దానిని ఈశ్వరుని అవతారంగా చెబుతారు. హిందువులు రాముణ్ణి మరియు కృష్ణుణ్ణి దేవుని (విష్ణువు) అవతారములుగా పిలుస్తారు. అవతారములు తమ అసాధారణమైన కార్యముల వల్ల గుర్తించబడతారు. పూర్ణ అవతార్, అంశ్ అవతార్, కళా అవతార్, అధికారీ అవతార్, ఆర్చా అవతార్ మరియు ఆదేశ్ అవతార్ మొదలగునవి అవతాం ములు ఏడు రకాలుగా స్వీకరించబడినవి.

ఎప్పుడైతే ధర్మమునకు భంగము కలుగునో అపుడు సదాచారులను రక్షించుటకు మరియు దుష్టులను నిర్మూలించుటకు భగవంతుడు స్వయంగా అవతారమెత్తుతాడని చెబుతారు. అవతారం ఎత్తుటకు చెప్పే ఒక ప్రత్యేక కారణం, భగవంతుని పూజ, ఆయన గుణములను కీర్తించుటలో సౌలభ్యము కలుగజేయటంగా చెప్పబడుతున్నది. భగవంతుడు అవతారం ఎత్తక (కానరానిచో) ప్రత్యక్షమవ్వనిచో దైవారాధన, దైవ ధ్యానమును మరియు దైవ భావనను దాసులు ఎలా చేయగలరు. అవతారవాదపు ఈ సిద్ధాంతం యొక్క అనౌచిత్యమును ఏ వ్యక్తీ సంశయ రహితంగా అర్థం చేసుకోలేడు.

5. పునర్జన్మపై విశ్వాసము : మానవుడు ఈ ప్రపంచంలో అజ్ఞానంలో పడి ఉన్నందున ఆత్మను గుర్తించలేడు. కావున అతడు 'ఉపాధి' అనగా మోసాలు, అడ్డంకులలోనే) ప్రపంచపు మాయ, నిరోధములలో బంధింపబడి ఉంటాడు. అందువల్ల అతడు లెక్కలేనన్ని జన్మలు తీసుకోవలసి వస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం ఈ ప్రపంచము వాస్తవానికి ఒక చెరసాల. ఇందులో ఆత్మలు తమ చెడుకర్మల శిక్షను అనుభవించుటకు వస్తాయి. ప్రపంచములో ఎదురయ్యే కష్టాలు దుఃఖాలు మరియు బాధలు, కుకర్మల ఫలము లేక శిక్షగా భావించడం జరుగుతుంది. వాస్తవానికి పరిశీలన, చింతనలను ఉపయోగించినచో మానవ సంస్కృతి నాగరికతకు, శిక్షణ కొరకు దుఃఖములు, కష్టములు ఉండవలసిన ఆవశ్యకత ఎంతైనా కలదు, అని ఈ విషయం మనకు సులువుగా అర్థమవుతుంది. దుఃఖాలు, బాధలు మానవుని నిద్రాణంగా ఉన్న శక్తులను మేల్కొలపడానికి ఎంతగానో సహాయకారులుగా నిర్ధారింపబడినవనేది వాస్తవమైన విషయం. పునర్జన్మ సిద్ధాంతము ఒప్పుకొనుటలో ఎన్నో దోషములు కలవు.వాటి వివరములోకి వెళ్లడానికి ఇక్కడ అవకాశంలేదు.

6. పునర్జన్మతో పాటు స్వర్గ-నరకముల వైదిక మత సిద్ధాంత భావన నశించిపోలేదు. ఈ విశ్వాసము పూర్తిగా వాస్తవమైన అర్థమును, స్థానమును కోల్పోయినప్పటికిని; నేడు కూడా హిందువులలో మనకు లభిస్తున్నది.

7. కర్మఫలములో విశ్వాసం : ఈ విశ్వాసమునకు హైందవ తాత్విక జీవనంలో కేంద్ర స్థానము లభించినది. పాపము లేక చట్టాల, ఆదేశాల తృణీకరణ అనే విషయం బాహ్యారూపేణా అంతకఠినమైనది కాదు. కానీ ఇది మానవుని ఆత్మ, అతని వ్యక్తిత్వం విషయంలో కఠినమైన తప్పుగా నిర్ణయింప బడినది. వాస్తవానికి మన వ్యక్తిత్వము యెడల విశ్వాసఘాతుకం, మన ఆత్మ; అవసరాలనుండి దృష్టిని మళ్లించేదానికి మరొక పేరే పాపము. కర్మ సిద్ధాం తము మనకు తెలియజేసేదేమనగా మానవుడు తన గతం అనే బరువుతోనే

జన్మిస్తాడు, దానిని తనతో పాటు తీసుకుని నడుస్తుంటాడు. ఈ భారమును కాలము తేలిక పరచలేదు, మృత్యువు దాని నుండి విముక్తినీ ప్రసాదించలేదు. ఎలాగైతే పట్టు పురుగు తన నోటి నుండి పట్టు ప్రోగును తీస్తూ, దానిలోనే అది బందీ అయిపోతుందో, అదేవిధంగా మోహము ఆధీనంలో ఉంటూ, తన కర్మ సూత్రములలో (కర్మల త్రాడులో) బంధింపబడిన "కర్త" (కర్మలు చేయు వాడు)యే అన్ని చెడు కర్మల ఫలితాన్ని భరించవలసి ఉంటుంది (మహా భారతం). మానవుని వ్యక్తిగత జీవితం ఎన్నో జీవనముల వరకు వ్యాపించి ఉన్న సంకెళ్లలోని ఒక అంశం లాంటి స్థానాన్ని పొందినది. జీవితపు ఈ ప్రయాణం మరణించినంతనే పరిసమాప్తం కాదు. మానవుడు తన తప్పుల, పాపముల ప్రతిఫలాన్ని అనుభవించి తన బలహీనతలు, లోపములు వీడి ఉన్నత స్థానమును పొంది సంపూర్ణ ముక్తి స్థాయికి తనను చేరవేసే వరకు ఇది కొనసాగుతూనే ఉంటుంది.

కర్మ- దాని ఫలము ఒకదానికొకటి తప్పనిసరైన భాగములుగా భావించటం జరుగుతున్నది. కర్మ ఫలమును మానవుడు తప్పనిసరిగా అనుభవించవలసినదేనని చెప్పబడుతున్నది. గాయాల పాలైన సైనికుడు తనలో నున్న ఉత్సాహం వలన వాటి కష్టాన్ని బాధల అనుభూతిని పొందక పోవచ్చు. కానీ ఆ తరువాత బాధ అనుభూతి ఆతనికి తప్పక కలుగుతుంది. ప్రస్తుత జీవిత కర్మలు గత జన్మపు కర్మల ప్రభావమునకు లోనై ఉంటాయి.

కర్మలను మూడు రకములుగా విభజించవచ్చును:

**అ. ప్రారబ్ధ కర్మము:** ఇది ఎలాంటి కర్మ అంటే దీని ఫలాన్ని తప్పనిసరిగా అనుభవించవలసి ఉంటుంది.

**ఆ. సంచిత కర్మము:** అనగా గతజన్మలో సేకరించబడిన కర్మ. ఈ కర్మయే వ్యక్తిత్వ నిర్మాణం, శీల నిర్మాణంలో ప్రభావమును చూపుతాయి. వీటి స్థానము బ్యాంకులో జమ చేయబడిన నగదు లాంటిదిగా భావించవలెను.

ఇ. **వర్తమాన కర్మముః** అనగా మానవుడు తన ప్రస్తుత జీవితంలో చేయుచున్న కర్మము.

8. ముక్తి , మోక్షముల మత సిద్ధాంతము కూడా హిందువులలో లభిస్తుంది. అన్నిటికంటే గొప్ప ముక్తి వారి వద్ద ఏమంటే మానవుడు "అగుణ్" లేక పునర్జన్మ చక్రం నుండి స్వేఛ్ఛ పొందటమే. కానీ వివరణలలోకే పోయి వీటిని ఎన్నో రకాలుగా నిర్ధారించడమైనది.

1). సాలుక్య సాన్నిధ్యము: అనగా ప్రభువు లోకంలో నివసించటం.

2. సామీప్యము : అనగా ప్రత్యేకమైన సామిప్యమును పొందటం.

3). సాయుజ్యము : అనగా ఈశ్వరునిలో విలీనమైపోవడం.

జైనుల మాదిరిగా సర్వ జీవులన్నీ సర్వోన్నతుడైన ఒకే దేవుని అస్థిత్వ భావనను అనుసరించే వారి వద్ద ఒక ముక్తి "కైవల్యముక్తి" కూడా కలదు. ఇందులో ఆత్మ తన శుద్ధమైన రూపమును, అనుభూతిని పొందుతుంది. ఇలాంటి అనుభూతి జీవితంలో కూడా కాగలదు.

## హిందూ ధర్మపు తాత్విక సమూహములు

హిందువులలో భావనల నుండి ఆచరణాత్మక ప్రపంచం వరకు లెక్కలేనన్ని భిన్నాభిప్రాయములు కలవు. మరిలాంటి ఎన్నో ధార్మిక తాత్విక సమూహములు వారిలో ఉనికిలోకి వచ్చినవి. వీటిలో ప్రఖ్యాతి గాంచినవిగా శైవ మరియు వైష్ణవ తెగలను మనం చూడగలము. వీరి వద్ద మూల విశ్వాస సిద్ధాంతములలో, ఆచరణలలో కూడా భిన్నత్వం కలదు. కానీ నియమాలు, మూల విషయాల్లో భేదాభిప్రాయాలున్నప్పటికీ ఒకరి విషయంలో "కుఫ్ర్" (ధర్మ భ్రష్టత్వం) "ఫత్వా" ను (ధర్మ శాసనమును) వెలువరించలేరు. ప్రతి ఒక్కరు తననుతాను "హిందువు"గా చెప్పుకునే హక్కు లభిస్తుంది. ఇక్కడ ధర్మంలో ఏ విధమైన ఒక హద్దు అనేది లేదు, దానిని మితిమీరిన వ్యక్తి ధర్మ భ్రష్టుడై పోతాడు.

ధర్మము అంటే ఏమి? దీనికి సమాధానంగా కూడా విభిన్నమైన విషయాలు చెప్పబడినవి. ధర్మము యొక్క ఉద్దేశ్యమేమి? ఈ పరంపరలో కూడా ఎన్నో మాటలు చెప్పబడినవి.

"ఐహికవాదం" ననుసరించే వర్గం చెప్పేదేమనగా దేని ద్వారా నైతే ప్రాపంచిక జీవితంలో సాఫల్యం సాధ్యమగునో, అలాంటి ఒక నియమం చట్ట వాస్తవమైన హిందూ ధర్మం.

ఒక వర్గం "ఉభయ వాదం" ను అనుసరిస్తుంది, దాని వద్ద "ఇహము" మరియు "పరము" రెండింటినీ సాధించే మార్గమే నిజమైన హిందూ ధర్మం. అనగా దేని ద్వారానైతే ప్రాపంచిక ప్రయోజనాలతో పాటు మరణానంతరం కూడా సాఫల్యం సిద్ధించాలి, అదే హిందూ ధర్మం.

ఇక మూడవ వర్గం "పారమార్థిక" అనగా పూర్తిగా ఆధ్యాత్మిక విషయాలు చెబుతుంది. వారివద్ద ఆత్మ ప్రాప్తి, నిర్వాణము, మోక్షము మరియు సాఫల్యాల సర్వోన్నతమైన అర్థం వైపునకు మార్గదర్శకం చేస్తూ దాని వైపునకు తీసుకు వెళ్లే మార్గమే హిందూ ధర్మం.

ఈ తాత్విక సమూహం దృష్టిలో ఈ ప్రపంచం ఒక కల. ఈ నిద్రా భంగమై ఆత్మ దర్శనం (స్వీయ పరిచయం) కలగాలి. వేరే పదాలలో ఈ ప్రపంచం రాత్రి లాంటిది. ఇది గడిచిన పిదప బ్రహ్మప్రాప్తి అనే దినపు పొద్దు పొడుస్తుంది. ఇదియే హిందూ ధర్మపు వాస్తవిక సాధ్యము లేదా ఆశయము. వేదాంతి, వైష్ణవము లాంటి సమూహాలు, నేడు ఆత్మ చింతనల పతాకాన్ని చేబూని వారు దీనినే సమర్థిస్తూ కనిపిస్తారు.

మొదటి సిద్ధాంతమును అనుసరించు వారి ప్రకారం; ఔబిబీది శిళి జలిఖిబిరీ (వేదముల వైపునకు మరలండి). ప్రాబల్యం వహించే సమయం ఆసన్నమైనది. ప్రాపంచిక అభివృద్ధి ఉద్యమాన్ని వేదముల ద్వారా పొంద

వచ్చును. ఇతరములను విసరివేయండి, కానీ ఇచ్చట ఒక వాస్తవాన్ని మరచి పోవటం జరుగుతున్నది. అదేమనగా కేవలం భౌతిక ప్రపంచమునే సర్వస్వంగా భావించేధర్మం ఏదేని జాతిని, దాని అల్ప సంస్కృతి (వెనుకబాటుతనాన్నుండి) బయట పడవేయటంలో ఎన్నడూ విజయవంతం కాలేదు.

మూడవ సమూహం వద్ద కూడా ఎంతో శూన్యత కలదు. దీనికి కారణ మేమనగా ఈ సమూహం ప్రాపంచిక జీవితం, దాని-ఆవశ్యకతల నుండి పూర్తిగా దృష్టిని మరల్చుకొంటుంది. మరలా ఈ సమూహం ఎల్లప్పుడు ప్రజలను మోసపుచ్చడమే వ్యాపకంగా చేసుకున్నది.

హిందూ ధర్మంలోని ఒక శాఖ తత్వవాదం. దీని ప్రస్తావనను మేము ముందుగానే చేసియున్నాము. కపిల సాంఖ్య పురాతన సమూహం దీన్ననుస రిస్తూ ఉండినది. మేము మొదట చెప్పిన విధంగానే ఈ సమూహం వద్ద ఆత్మ జ్ఞానాన్ని పొందుటయే ముక్తికి మార్గము. మరి ఈ ఆత్మ జ్ఞానం చిత్తశుద్ధి ద్వారానే లభించగలదు. దీని కొరకు కొన్ని నియమాలు, ఆదేశాలు కూడా జారీచేయబడినవి.

డాక్టర్ రాధాక్రిష్ణన్ వారు హిందూ ధర్మంలోనున్నటువంటి నిమ్నోన్నతల అన్ని విధాలైన భావనల కొరకు విశాల హృదయం, వెసులుబాటుల నామముతో ధృవీకరణా మార్గమును కనుగొన్నారు. కానీ ఆయన ఒక విషయాన్ని మరిచారు. అదేమనగా విశాల హృదయం అనే నెపంతో భ్రమలు లేక ఊహల ఆరాధన, అసత్యాన్ని ధృఢ పరచడం తీవ్రమైన, క్షమార్హం కానటువంటి నేరం అవుతుంది. మరి ఇది ఎలాంటి విశాల హృదయత్వం, వర్ణ సంస్థా(వర్ణాశ్రమము) ద్వారా జాతిలో అసమానతలు మరియు ఉచ్ఛనీచముల భావనలను పెంపొందింపజేయడం జరుగుతున్నది. సుధీర్ఘ కాలం నుండి ఒక సమూహాన్ని శూద్రులుగా చేసి ఉంచడమైనది. దాని పట్ల ఎలాంటి ప్రవర్తన జరిగినదంటే, దానిని మనం చివరకు ఎలాంటి విశాల హృదయం, దృష్టివల్ల లభించిన ప్రతిఫలంగా నిర్ణయించగలం.

## హిందూ ధర్మం లోపాలు

హిందూ ధర్మంలో గల బోలుతనం, లోపాలు గలవాటిని ఇక్కడ ఒకే చోట క్రోడీకరించి ప్రస్తావించవలసిన ఆవశ్యకత గోచరిస్తున్నది.

1. హిందూ ధర్మం ఏదేని సాధికారికమైన (Authentic Religion) ధర్మం కాదు. ఇచ్చట "అస్మావుర్రిజాల్" (మహాప్రవక్త ముహమ్మద్ (స) వారి ప్రవచనములు లేక హదీసుల ఉల్లేఖకుల గూర్చి ఈ విద్యలో వారి జీవిత విశేషాలు, వారి కాలం, వారి గురువులు, శిష్యులు, విద్యావ్యాప్తికి చేసిన ప్రయాణాలు, వారి విశ్వసనీయత ప్రమాణాన్ని గురించి హదీసు వేత్తల నిర్ణయాలున్నాయి. ఇది చాలా విస్తృతమైన శాస్త్రం, ఆసక్తి కరమైనది కూడాను) లాంటిది (విద్య) కళ ఏదీ ఆవిర్భవించలేదు. ప్రమాణాల వైపు ఏలాంటి శ్రద్ధ ఇవ్వబడలేదు. దీని అధికాంశ విషయములు ఊహాజనితములు, ప్రామాణికత లేని కథనాలపై ఆధారపడి ఉన్నవి. వీటితో పాటు ఈ ధర్మం ధార్మిక గ్రంథములలో ఎన్నో మార్పులు-చేర్పులు కూడా జరుగుతూ వస్తున్నవి. పరిశోధకులు వాల్మీకి రామాయణం మార్పులు-చేర్పుల నుండి సంరక్షించబడినది కాదు అనే విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉన్నారు. తులసిదాస్ రామాయణంలో కూడా చేర్పులు జరిగినవి. అంతే కాదు దీని ఎనిమిదవ కాండము ఆసాంతం ఈ చేర్పులలోని భాగమేనని తెలుపబడినది. మనుస్మృతి పరిస్థితి కూడా ఇందుకు విరుద్ధముగా ఏమీ లేదు. ఇందులో కూడా నిరంతరం మార్పులు జరుగుతూ ఉన్నవి. స్వయంగా ప్రస్తుత కాలములో ప్రసిద్ధి చెందిన గ్రంథం "సత్యార్థ ప్రకాశం"లో దాని రచయిత పరమ పదించిన తరువాత రెండు శాశ్వతమైన కాండములను పెంచడమైనది. వీటితో పాటు ఇతరములైన మార్పులు-చేర్పులు కూడా ఈ గ్రంథములో జరిగినవి. దీని రచయిత స్వామి దయానంద గారి తరువాత మాంసాహార భక్షణ, జంతుబలి (ధర్మ) సమ్మతి గురించిన చర్చను "సత్యార్థ ప్రకాశం" నుండి తొలగించడ మైనది. గ్రంథపు

తొలి ముద్రణలో చెప్పబడినదేమనగా జగత్తు భౌతిక కారణం, సృష్టికి కారణం, సాధారణ కారణం మూడింటికినీ పరమేశ్వరుడే. రెండవవాడు ఎవ్వడునూ కాదు. ఈశ్వరుడు తన అనంతమైన సామర్థ్యంతో విశ్వాన్ని సృష్టిం చాడు. ఏడవ కాండంలో వ్రాయబడిన విషయమేమనగా జీవము (ఆత్మను) ఈశ్వరుడే పుట్టించాడు. కానీ వీటన్నింటినీ ఈ గ్రంథము నుండి తీసివేసి (ఇలా వ్రాయడ మైనది) ఈశ్వరుడు, జీవము మరియు ప్రకృతి మూడు కూడా శాశ్వతమైనవిగా వ్రాయడమైనది.

2. హిందూ ధర్మం గ్రంథముల వాస్తవమైన భాష సంస్కృతం. ఇది ఒక సజీవమైన భాష కాదు. ఈ కారణం చేతనే గ్రంథముల తాత్పర్యమును, అర్థములను గ్రహించుటలో కఠినమైన సమస్యలను ఎదుర్కో వలసి వస్తున్నది.

3. ఈ ధర్మం "మునజ్జిల్ మినల్లాహ్" దేవుని నుండి అవతరింప జేయబడినది కాదు. ఇది అలాంటి వాదన కూడా చేయదు. ఇందుకు భిన్నముగా దీనిని ఋషులు మరియు తాత్వికవేత్తలు తమ (ఇంద్రియ నిగ్రహం) ప్రయాసము సాధన–తపస్సు, వారి భావనలు, అనుభవముల ప్రతి ఫలంగా నిర్ణయించబడుతున్నది.

4. దీని స్థాపకులు, దీని నిర్మాణంలో భాగస్వాములైన వ్యక్తుల చరిత్ర కూడా సురక్షితంగా లేదు. వారిని గూర్చి ఏ విషయాలైతే చెప్పబడుచున్నవో వాటిలో వాస్తవంతో పాటు కట్టు కథల కలయిక ప్రస్ఫుటంగా కానవస్తున్నది.

5. హిందూ ధర్మంలో ఎన్నో వైరుధ్యముల–రాశులు పేరుకున్నట్లుగా కానవస్తున్నాయి. ఇక్కడ కొన్ని విరుద్ధ విషయాల ఉదాహరణల ప్రస్తావన అసంధర్భమైన విషయం కాదు. ఉదాహరణకు విశ్వసృష్టి గురించి పరస్పర విరుద్ధమైన విషయాలు చెప్పబడి ఉన్నాయి. వీటిలో పొంతన కలుగజేయుట సంభవమైన విషయం కాదు. ఈ పరస్పర విరుద్ధమైన వాటిలో కొన్ని విషయాలు ఇవి.

(1) విశ్వం ఒక తొలి బలిదానమునకు ప్రతిఫలంగా ఉనికిలోకి వచ్చినది.

(2) ఇది లైంగిక కార్యపు ఫలము, విశ్వపు లైంగిక కార్యము ద్వారా సృష్టి ఆరం భావన తరువాతి కాలపు మత భావనలలో పెద్ద భూమికను నిర్వర్తించినది. వైదిక సాహిత్యంలో కూడా ఈ భావన వివిధ రూపములలో పునరావృతం చేయబడినది.

(3) ఈ ప్రపంచము ఒక స్వర్ణమయమైన గర్భము నుండి పుట్టినది. ఈ భావనను తరువాత కాలంలో హిందూ దేవమాలలో 'బ్రహ్మాండం"గా పేర్కొనడం జరిగింది.

(4) ప్రపంచం వేడి నుండి ఉనికిలోకి వచ్చినది.

(5) సృష్టికార్యము ఒక వ్యక్తి "స్వీయ జ్ఞానం" అను అస్థిత్వపు జ్ఞానంతో సంబంధం కలిగియున్నది. ఆ వ్యక్తిని పురుషుడు లేక ప్రజాపతిగా పిలువటం జరిగినది. ఈ పురుషునికి ఏకాంతపు భావన భయం బాధించినపుడు, అతనికి ఒకరి సాంగత్యపు ఆవశ్యకత కలిగినపుడు అతడు తనను రెండు భాగములుగా విభజించుకొనెను. ఈ విధంగా స్త్రీ అనగా అతని భార్య జన్మించినది. ఈ జంటయే వివిధ పశువులు, ప్రాణులు, మానవుల రూపమును స్వీకరించి ప్రపంచాన్ని పరిపూర్ణం గావించినది.

ఈ విధముగా మనం చూచేదేమనగా విశ్వసృష్టి విషయంలో పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు ఈ ధర్మంలో లభిస్తాయి. మాంసాహారమును భుజించే అనుమతి మహాభారతంలో, షతఫత్ బ్రహ్మాణము మరియు మనుస్మృతిలో ఇవ్వబడినది. కాని రెండవ వైపున మహాభారతం అనుశాసన పర్వములో మాంసమును భుజించే వారిని నిందించడమైనది. (15: 24-25).

ఆత్మహత్యను ఒక వైపున మహాభారతంలో చాలా శ్రేష్టమైన కార్యంగా నిర్ణయించడమైనది. రెండవ వైపున ఆత్మహత్యకు శిక్ష శాశ్వత నరకంగా చెప్పడమైనది.

మహాభారతంలో ఇలా చెప్పబడినది; తపము, యజ్ఞము మరియు ఇతర పుణ్యములు సంతానమునకు సరిసమానం కాలేవు (11:12-30). కానీ హిందూ ధర్మంలో సాధువులు, మహంతులు మరియు సన్యాసులు ఎవరైతే ఒంటరి జీవితమును జీవిస్తారో వారికి పవిత్రమైన స్థానమును ఇవ్వడమైనది. ఒక వైపున ఇలా చెప్పబడినది:

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర్ దేవతః!"

"ఎచ్చట నారి(స్త్రీ) పూజింపబడునో అచ్చట దేవతలు (ని)వసిస్తారు". ( మను స్మృతి : 3 - 56 )

రెండవ వైపున ఈ ప్రకటనను వినండి:

"త్యాగహు నారీ నరక్ కర్ జానీ!

జాన్ లేహు సుర్ నర్ ముని జ్ఞానీ!!"

"నారీ (స్త్రీ)ని నరక సమానమైనదిగా భావించి నీవు త్యజించు! ఈ మేసురులు (దేవతలు), నరులు (మానవులు), మునులు, జ్ఞానుల ప్రాణాన్ని సైతం హరించి వేస్తుంది. (తస్మాత్ జాగ్రత్త!)"

హిందూ ధర్మం ఒక వైపు 'పునర్జన్మ" సిద్ధాంతమును మత విశ్వాసంగా బోధిస్తుంది. కాని రెండవ వైపున పితృలోకము, స్వర్గ-నరకాల గురించిన ప్రస్తావన కూడా తెలుపుతున్నది. వాస్తవానికి ఈ రెండు సిద్ధాంతములలో స్పష్టమైన వైరుధ్యము కలదు.

6. జీవితపు అన్ని రంగాలలో అనుసరించదగిన ఆదేశములు ఇక్కడ లభించవు. నేటి సామాజిక, ఆర్థిక మరియు రాజకీయ సమస్యలను సులభంగా నివృత్తి చేయగలిగే ఆదేశాలు లేవు.

7. బోధనలలో సమతూకం, పరిమితత్వం లోపించినది.

8. సన్యాసత్వమును గౌరవనీయమైన దృష్టితో చూడడం జరుగుతుంది. జీవితమును ఒక ప్రసాదితముగా భావించుటకు బదులుగా దానిని దుఃఖముగా భావించటం జరుగుతుంది. స్వయంగా తమ అస్థిత్వము నుండి అయిష్టత, కోరికలను బలిచేయుటయే ధర్మంగా భావించడమైనది. వాస్తవానికి ఇది స్పష్టంగా అసహజమైన సిద్ధాంతము.

9. ఇచ్చట భావనాత్మక వృద్ధికి అవకాశం చాలా తక్కువ.

10. దీని మూలం లోతైన మరియు మనోవికాసమైనది కాదు.

11. కేవలం వ్యక్తికే సంపూర్ణమైన ప్రాధాన్యత ఇవ్వడమైనది. సామూహికతకు లభించవలసిన స్థానం లభించలేదు.

12. ఇందులో విశ్వజనీన స్థాయి దర్పము ప్రస్ఫుటంగా లేదు. ఇది సందేశాత్మకమైన ధర్మం కాదు. సర్వ మానవాళిని తన సంభోధితులుగా భావించదు.

13. అజ్ఞానపు సిద్ధాంతముల ప్రభావం వల్ల మానవుల మధ్య వ్యత్యాసము, నీచత్వపు భావన మరియు పురోహితవాదము మొదలగు బంధనాలలో లోకులను కట్టివేసినది. ఇక్కడ ఊహల అనుసరణ, అద్భుతాలను కోరుకొనుట, ఊహల ఆరాధనయే ప్రజలు నిజమైన ధర్మంగా భావిస్తున్నారు. కొన్ని సంధర్భాలలో “గురువు”నకు దేవుని స్థానము లేక దానికంటే ఉన్నతమైన స్థానం ఇవ్వడమైనది. తార్కికంగా అర్థం చేసుకోకుండానే విశ్వసించడాన్ని ప్రత్యేకతగా, గొప్ప విషయంగా భావించటం జరిగినది. ఇక్కడ గ్రుడ్డిగా విశ్వసించడమే వాస్తవమైన విశ్వాసం. నిరాడంబరత ఏదనగా అమాయకత్వపు

హద్దుల వరకు చేరి ఉన్నది. ఈ మతం అనేక బాధ్యతలు తమ పురోహితులపై వేసి ప్రజలు తమకుతాము వాటి నుండి విముక్తులైనట్లుగా భావిస్తారు. ప్రజలలో బేధభావములు, ఉచ్ఛ-నీచములు హిందూ ధర్మం ప్రత్యేకతగా నిలిచి పోయినవి.

14. ఇక్కడ ధర్మం ముఖ్యమైన భూమికను నిర్వర్తించేదిగా వృద్ధి చెందుతూ కానరాదు.

15. చరితములు, మత గాధలలో అశ్లీలం, నగ్నత్వం, లైంగిక తృష్ణల ప్రస్తావనలు, కోరికలకు చెందిన చేష్టలు అధికంగా తారస పడతాయి.

16. తెగల వాదం, అసమానత్వం, అంటరానితనం, పక్షపాత ధోరణులు, సంకుచిత దృష్టి నుండి పరిశుద్ధమైనది కాదు. సామాజిక ప్రక్షాళన మరియు సామాజిక సంక్షేమం, శ్రేయస్సులను ధర్మం ముఖ్యమైన ఉద్దేశ్యములలో భాగములుగా భావించబడలేదు.

17. విద్య, దూరదృష్టి, పరిశీలనా భావన, ఆలోచనలకు సహజంగా లభించవలసిన స్థానం ఇవ్వలేదు.

18. ఉద్యమ స్ఫూర్తి లోపించినట్లుగా తెలుస్తున్నది.

19. ఇది సహజసిద్ధమైన మతం కాదు. జీవనపు సూచనలు, చిహ్నములు ఇక్కడ లోపించినవి.

ఇన్ని లోపములున్నప్పటికే హైందవ సాహిత్యంలో ముక్తి, తాత్విక జ్ఞానం, బుద్ధికుశలతలతో తులతూగుతున్న ఎన్నో అమూల్యమైన కాండము లున్నవి. వాటి ప్రాముఖ్యతను, విలువను ఒక విశ్వాసికంటే అధికంగా వేరెవరుగాని ఒప్పుకోలేరు. కానీ మానవుని కొరకు వాస్తవమైన ముక్తి మార్గము,

దైవాదేశముల అనుసరణ, ఆయన ధ్యానం ద్వారానే లభించగలదు. దేవుని సమ్మతమైన విషయముల జ్ఞానం లేకుండానే, దేవుని ఆజ్ఞాపాలన, దాస్యమును చేయుట అసంభవం. అంతేకాదు మానవుల విషయంలో ఆయన ప్రణాళిక లేమిటో తెలియక పోవటం కూడా ఒక పెద్దలోపం.

దివ్య ఖుర్‌ఆన్ లో ఇలా ఉన్నది :

**"ఎవరైతే (దేవుని ప్రణాళిక) పరలోకాన్ని విశ్వసించరో వారే చెడుగుణాలు ఆరోపింపదగినవారు. ఇక అల్లాహ్ - ఆయనకు అందరికంటే ఉన్నతమైన గుణాలు ఉన్నాయి. ఆయనే అందరిపై ప్రాబల్యం కలవాడు. వివేకంలో పరిపూర్ణుడూను"**

**(అన్ నహ్లా-16 :60)**

మేము ఒక ముస్లిమేతర విద్వాంసుని ("గీతా" గ్రంథంపై పరిశోధన చేస్తున్న సంధర్భంలో నన్ను కలిశారు) అడిగాను, దైవ సమ్మతమైన విషయాల జ్ఞానాన్ని (తెలుసు కొనుటకు) పొందుటకు ఏ సాధన (అభ్యాసన) సమాధి (భావనలను కేంద్రీకరించుట) కలదు. అప్పుడాయన ఎలాంటి అరమరికలు లేకుండానే దైవసమ్మతం తెలుసుకొనుటకు prophethood (దైవదౌత్యము) తప్ప వేరే మార్గాంతరమూ ధర్మంతో సరిపోల్చినా వివిధ కోణాలలో చూసినా, ఇస్లాం ధర్మాన్ని మనం అధ్యయనం చేసినచో దాని ఘనత, ప్రాముఖ్యతల భావన అత్యధికంగా పెరిగిపోతుంది. ఇక్కడ సంక్షిప్తంగా మనము ఇస్లాం ముఖ్య గుణగణాలు దాని ప్రత్యేక గౌరవం వైపునకు సంజ్ఞ చేయగోరుతున్నాము. తద్వారా దాని గౌరవం, విలువల వాస్తవమైన పరిమాణం తెలియగలదు.

## ఇస్లాం ప్రాముఖ్యత

1. ఇస్లాం యొక్క మొట్టమొదటి ప్రత్యేకత ఏమనగా, అది ఒక సాధికారమైన ధర్మము (authentic religion).

దీని సాధికారతలను(authenticity) ఛాలెంజ్ చేయలేము. ఇచ్చట వ్రాతపూర్వక ఆధారములతో పాటు వ్యక్తిగతమైన కథనముల భగ్నము చేయలేనటువంటి పరంపర కూడా స్థాపించబడి ఉన్నది. ముస్లింలు "అస్మా ఉర్రిజాల్" ఒక అసాధారణమైన కళను ఉనికిలోకి తెచ్చారు. అందులో ఒక లక్షకు పైబడిన ఉల్లేఖకుల(కథకుల) పరిస్థితులు భద్రపరచబడినవి. ఇస్లాంలో బలహీనమైన కథనముల (వేటినైతే విశ్వసింపదగినవి కానివిగా భావించబడి నవి) విషయంలో ఉన్న ఆధారములు, హిందూ ధర్మంలో దాని మూల బోధ నలు విశ్వాసముల విషయంలో ఆ స్థాయికి చెందిన ఆధారములు లభించలేదు. అక్కడ ఆధారముల వైపు ఏలాంటి శ్రద్ధ ఇవ్వబడలేదు. ప్రాచ్య దేశాల భాషా నిపుణుడు జమాలుద్దీన్ అఫ్ఘానీకి సమకాలీనుడు అయిన ఎర్నెస్ట్ రెనిన్ (Earnest Renan) అనే ఫ్రెంచి జాతీయుడు స్పష్టమైన పదాలలో ఇలా ఒప్పుకున్నాడుః

Islam was born in the full light of history. (Quoted by Bernard Lewis – Arab in the History. Page – 62.

"ఇస్లాం ఉద్భావం చరిత్ర పరిపూర్ణ కాంతిలో జరిగినది".

2. ఇస్లాం ప్రాథమిక మూల భాష అరబీ. ఇది నేడు కూడా సజీవమైన భాషగా స్థానం కలిగి ఉన్నది. దీనిని మాట్లాడే అర్థం చేసుకునే వారు పెద్ద సంఖ్యలో ప్రపంచపు నలు మూలల్లో ఉన్నారు.

3. ఇస్లాం ధర్మం ఏలాంటి ధర్మము జీవిత విధానమనగా అది "మునజ్జల్ మినల్లాహ్" ( దైవం వైపు నుండి అవతరించిన ) వంటిది. కావున ఇచ్చట దేవుని ఆదేశం ఆయన అభీష్టమైన ధర్మం. దీని కంటే ఉత్తమమైన ధర్మంగా దేనినీ భావించలేము.

దివ్యఖుర్ఆన్‌లో ఇలా తెలుపబడినది

**"పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరొకరెవరికీ లేదు. ఆయనను తప్ప మీరు ఎవరి దాస్యాన్నీ చెయ్యకూడదని ఆయన ఆజ్ఞ. ఇదే శుద్ధమైన, సరియైన జీవిత విధానం. కాని ఇది చాలా మందికి తెలియదు". (యూసుఫ్ – 12:40 )**

ఇస్లాం మూలం ఊహలు, భ్రమలపై లేదు. ఇంధుకు భిన్నంగా దైవవాణి 'వహీ' పై కలదు :

**వారితో ఇలా అను; "నేను కేవలం నా ప్రభువు నా వద్దకు పంపిన వహీని మాత్రమే అనుసరిస్తాను. ఇందులో జ్ఞాన కాంతి పుంజాలు ఉన్నాయి. అవి మీ ప్రభువు తరఫు నుండి వచ్చాయి. ఇది మార్గదర్శకత్వం, కారుణ్యం, దానిని స్వీకరించే వారి కొరకు."**

**(అల్ ఆరాఫ్ – 7: 203)**

ఊహలను పెంపొందించుట, అంచనాలు, కేవలం అనుమానాల గురించి దాని తీర్పు ఇలా ఉన్నది.

**"నిజానికి సత్యం అవసరాన్ని అనుమానం ఎంత మాత్రం తీర్చలేదు". (యూసుఫ్ – 12 :46)**

**"సత్యం స్థానంలో అనుమానం ఏమాత్రం ఉపయోగపడదు కదా!". (సూర అన్నజ్మ్ – 28)**

4. దాని సందేశహరుడు హజ్రత్ ముహమ్మద్ (సఅసం) వారి జీవన చరితం సురక్షితముగా ఉన్నది. ఆయన (స) జీవితపు ప్రతి రంగము తేజోవంతమైన వెలుగులా స్పష్టముగా, ప్రత్యేకముగా నున్నది. దీని ద్వారా ఆయన(స)

ద్వారా తేబడిన సందేశమును తెలుసుకొనుటలో ఎంతగానో సహాయం లభిస్తుంది.

5. ఇస్లాం అన్ని రకాలైన విభేదాల నుండి పరిశుద్ధముగానున్నది. దీని విశ్వాస సిద్ధాంతాలు, ఆచరణల మధ్య ప్రగాఢ, సహజమైన పరస్పర సంబంధము, సామ్యము కలదు. మూల విశ్వాసాలలో పరస్పర సామ్యము, సంబంధమున్నది. దాని ఆదేశాల పరిస్థితి కూడా ఇలాగే ఉన్నది. వీటిలో విభేదం ఎటువంటి ఢీకొను (Contradiction) స్వభావం లేదు. అదే హిందూ ధర్మములోనైతే మేము ముందుగా ప్రస్తావించినట్లుగా విభేదాలు కోకొల్లలుగా నున్నవి. దాని మత విశ్వాస సిద్ధాంతములు, ఆదేశములలో పరస్పర సామ్యము లోపించినది.

6. ఇస్లాం ఒక సువిశాల, సంపూర్ణ ధర్మం. జీవితానికి సంబంధించిన అన్ని రంగములకు హితవులను గరిపినది. సూర్యచంద్రులు వెలుగు విరజిమ్ముతున్నంత వరకు మమ్ములను మార్గనిర్దేశనం చేయుటకు తగిన ప్రాథమిక విశ్వజనీనమైన నియమాలను కలిగి యున్నది. దీని ఆదేశాలు సహజమైన, మధ్యస్థమైన మరియు అనుసరణీయమైనవి. ఇది అభివృద్ధికి శత్రువు కాదు. సన్యాసత్వపు బోధనలను ఇవ్వదు. అంతేకాదు జీవితంతో విరక్తి పొందుటను పవిత్రమైన విషయంగా నిర్ణయించదు. ఇది వాస్తవమైన జీవితమునకు అర్థము పర్యాయ పదము. జీవితమును విలువైన దృష్టితో చూస్తుంది. అంతేకాదు దాని స్పష్టమైన ఉన్నతమైన ఉద్ధేశ్యమును నిర్ణయిస్తుంది. ఇది నిశ్చయమైన స్వరూపాన్ని కలిగిన ధర్మం. దీని పునాది ప్రతికూల లేక వ్యతిరేక ప్రతిచర్యపై నిస్సందేహంగా ఉంచబడలేదు.

7. ఇక్కడ తాత్విక జ్ఞానాభివృద్ధి కొరకు సంపూర్ణ అవకాశం ఇవ్వబడినది. ఇది విశ్వమును లోబరుచుకొనమని పురికొల్పుతుంది.వాస్తవానికి ఈ

ధర్మమే పరిశోధనాత్మకమైన సైన్సుకు పునాది వేసినది. ఇది విజ్ఞాన శాస్త్ర పరిశోధనలను, ఆవిష్కరణల మార్గములో ఏలాంటి అడ్డంకులు సృష్టించదు. ఇది సమస్యల విషయంలో బేధాభిప్రాయాలకు అవకాశం ఉండాలని భావిస్తుంది. మరియు దానిని ఆదేశాలలో వ్యాప్తి, విశాలత్వముపై వర్తింపజేస్తుంది.

8. దీని మూలం చాలా లోతైనది మనోవికాసమైనది. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా సెలవియ్యబడినది.

> **"మీరు కృతజ్ఞతలు చూపే దాసులుగా ఉన్నప్పుడు, విశ్వాస మార్గంలో నడుస్తూ ఉన్నప్పుడు మిమ్మల్ని అల్లాహ్ నిష్కారణంగా ఎందుకు శిక్షిస్తాడు?" (అన్ నిసా - 4 : 147)**

ఇక్కడ విశ్వాసపు పునాది అంధానుసరణపై లేదు. ఇందుకు విరుద్ధంగా కృతజ్ఞతా భావనపై ఉంచబడినది. దాని అర్థం ఏమనగా, దాసుడు మొదట దైవం ప్రసాదించిన వాళ్లను ఆయన ప్రసాదితముల పరిచయం పొందుతాడు, వాటిని దైవం అతనిపై కురిపించాడు. తద్వారా దాసుని హృదయం కృతజ్ఞతా భావంతో పొంగిపొరలి, అతడు ఇంతటి వరప్రసాదితుడు కారుణ్యమూర్తి అయిన దేవుని నుండి అపరిచుతుడిగా ఉండలేడు. అతడు దేవునిపై మోహితుడై పోతాడు. ఈ స్థితినే దివ్యఖుర్ఆన్ ఈమాన్ (విశ్వాసం) అనే పదంతో సరిపోల్చుతుంది.

9. సామూహికత ఆవశ్యకత పట్ల ఈ ధర్మం అలక్ష్యం వహించదు. ఇస్లాంలో వాస్తవంగా వ్యక్తికే ప్రాధాన్యత కలదు, కానీ సామూహిక హక్కులను నిర్వర్తించే విషయంలో అది నిర్భంధమైనవిగా నిర్ణయిస్తుంది. ఇందులకు దాని భోధనలు, ఆదేశాలు సాక్ష్యమిస్తున్నాయి.

10. అది మృత్యువును జీవితపు అంతంగా భావించదు. ఇందుకు

భిన్నంగా దానిని జీవితపు పురోభివృద్ధికి రూపంగా పరలోక జీవితాన్ని పరిగణిస్తుంది. అంతేకాదు దానిని జీవితపు పరంపర ఊహకందని సంతోషాన్ని పొందే స్థితిగా శుభవార్తను ఇస్తున్నది.

11. ఈ ధర్మం విశ్వస్థాయిని కలిగి ఉన్నది. ఇది సర్వమానవాళి కొరకు ఆచంద్రార్కం హితోపదేశం, వెలుగైయున్నది. దీని వలన మానవాళి అంతటి కొరకు ఒక గొప్ప విశ్లేషణాత్మకమైన సందేశం లాంటి స్థానాన్ని పొందినది.

12. ఇస్లాం ఊహల అనుసరణ, అద్భుతముల ఆరాధనల నుండి పరిశుద్ధమైనది. దీని సత్యత విషయంలో విశ్వమంతయూ సాక్షిగానున్నది. అందువలననే దివ్య ఖుర్ఆన్ ప్రజలను విశ్వం. జీవములో వ్యాపించియున్న గుర్తులను యోచించ వలసినదిగా సందేశం ఇస్తున్నది.

13. ఇక్కడ ధర్మం ఒక ఆదర్శవంతమైన (వ్యక్తిత్వపు) రూపంలో మన ఎదుటకు వస్తుంది. దీని దృష్టిలో మానవుని వాస్తవమైన అత్యంత విలువైనవి అతని గుణగణాలు మరియు వ్యక్తిత్వమే.

దివ్యఖుర్ఆన్ లో ఇలా గలదు :

**"మంచిని తెచ్చేవాడికి దానికంటే మేలైన మంచి లభిస్తుంది. ఇక చెడును తెచ్చే వారి విషయం; చెడు పనులు చేసేవారికి వారు చేసిన దాని ప్రకారమే ప్రతిఫలం లభిస్తుంది". (అల్ ఖసస్ – 28 : 84)**

మరియొక చోట ఇలా చెప్పబడినది :

**"మానవులందరూ బ్రతికింపబడే రోజున నన్ను అవమానం పాలుజేయకు. అపుడు సంపద వల్లగానీ, సంతానం వల్లగానీ ఏ లాభమూ కలగదు; ఏ వ్యక్తి అయినా మంచి మనస్సుతో అల్లాహ్**

**సాన్నిధ్యంలో హాజరైతే తప్ప". ( అష్ షూఅరా - 26: 89 )**

14. నగ్నత్వం, చెడుపనులు, ప్రాపంచిక ఫలాలను జుర్రుకోవాలనే భావనను నిర్మూలిస్తూ, మానవుని శీలం, వ్యక్తిత్వాల పరిశుద్ధతను ఒసంగడమైనది. అంతేకాదు, కోరికలను అదుపులో ఉంచుకోవాలని బోధించి ఇస్లాం తన అనుయాయులను ప్రజల గౌరవ, మర్యాదలకు సంరక్షకులుగా చేస్తుంది. దీని భావం, మానములను హరించేందుకు, సమాజాన్ని చెడుల రొంపిగా మార్చేందుకు స్పష్టమైన అనుమతి లభించిందని కాదు. అది మహిళల సహజ హక్కులను సంరక్షిస్తుంది, వాస్తవానికి వారు అర్హులైన, గౌరవప్రదమైన స్థానాన్ని ప్రసాదించినది.

15. ఇది ఒక న్యాయమైన వ్యవస్థను ప్రవేశపెడుతున్నది. న్యాయపు పరిధిని జీవితపు అన్ని రంగాలలోనూ వ్యాపింపజేయాలని కోరుతున్నది. మానవుడిని ఒక వ్యక్తిగా గౌరవనీయుడు, ఆదరణీయుమైనవాడుగా నిర్ణయిస్తున్నది. ఈ కారణం చేతనే అది అజ్ఞానపు పక్షపాతము, నిమ్నోన్నతల బేధభావములను తుడిచివేసి ప్రపంచానికి వాస్తవమైన సమానత్వ పాఠాన్ని ఇచ్చినది. సమాజపు బలహీన వర్గంపై ఏలాంటి పీడనను జరుగుటను సహించదు. స్వామి వివేకానంద గారు స్పష్టమైన పదాలలో ఇలా ఒప్పుకున్నారు.

My experience is that if ever any religion approached to this equality in an appreciable manner it is Islam alone. (letters. Page- 379)

"నా వ్యక్తిగత అనుభవం ప్రకారం, ఏదేని మతము ఈ సమానత్వము, ఆదరణ యోగ్యమైన పద్ధతి వరకు చేరువయ్యిందంటే, అది ఇస్లామే. నిశ్చయంగా ఇస్లామ్ మాత్రమే."

16. ఈ ధర్మం ఊహలను కూకటి వేళ్లతో సహా పెకలించి విసిరేసినది. అంతేకాదు, జ్ఞానం, తెలివితేటలకు ప్రాథమికమైన ప్రాముఖ్యతను ఇచ్చినది. అందువలననే ఇది సత్యధర్మం అయినది. ఇది మనలను ఏదేని విషయాన్ని కేవలం తెలివితేటలు, జ్ఞానము ఆధారంగానే ధృవీకరణ, అనుసరణ చేయమని కోరుతుంది. ఈ ధర్మం ఆత్మయే వివేకం (wisdom). మరియు శక్తి, అధికారాలు దాని ప్రత్యేకత. అణిగిమణిగి ఉండటం దాని నైజంలో లేదు. ఇది నిరాశావాదమును తుడిచివేస్తుంది. అంతేకాదు, విప్లవాత్మకమైన ఆలోచనలను, మేథస్సును జనింప జేస్తుంది. ఇది న్యాయస్థాపనలో సహాయకారియైన అధికారము మరియు పరిపాలనను శుభకరమైనదిగా నిర్ణయిస్తుంది. అంతేకాదు దౌర్జన్యం, సంక్షోభాలకు అవకాశం ఇవ్వదు.

> **"ఓ అల్లాహ్! విశ్వ సామ్రాజ్యాధిపత్యానికి ప్రభూ! నీవు కోరిన వారికి ప్రభుత్వాధికారిన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారి నుండి దాన్ని లాక్కుంటావు. నీవు కోరిన వారికి గౌరవాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారిని పరాభవం పాలుచేస్తావు. శుభాలు నీ ఆధీనంలో ఉన్నాయి."**
> **(ఆలి ఇమ్రాన్ - 3 : 26)**

17. ఇది దేవుని గుణవిశేషణా నామములను మన కృతజ్ఞతా భావనకు ప్రామాణికంగా నిర్ణయిస్తుంది. దేవుని గుణవిశేషణముల ప్రతిబింబం మన జీవితాలలో ప్రస్ఫుటమవ్వాలని అది అభిలషిస్తుంది. దేవుడు వెలుగైనచో ఆయన కాంతిపుంజాలతో మన జీవితాలు వెలుగొందవలెను. ఆయన ఉదారస్వభావుడు కావున ఉదారత్వంతో మన హృదయాలు తులతూగాలి. ఆయన ఉపకారి కావున మనం కూడా ప్రపంచవాసుల విషయంలో ఉపకారులం అవ్వాలి. ఇందుకు భిన్నంగా దౌర్జన్యపరులు, జగడాలమారుల

లాగా పుడమిని సంక్షోభాలతో, దుఃఖములతో నింపివేయరాదు. దివ్య ఖుర్ఆన్‌లో ఇలా సెలవియ్యబడినది:

**"అల్లాహ్ నీకు ఉపకారం చేసిన విధంగానే నీవూ ఉపకారం చేయి. భూమిపై కల్లోలాన్ని సృష్టించే ప్రయత్నం చేయకు. అల్లాహ్ కల్లోలం సృష్టించే వారిని ప్రేమించడు." (సూర అల్ ఖసస్ - 28: 77)**

18. ఇస్లాం మృత (dead) ధర్మం కాదు. ఇందుకు భిన్నంగా ఇది సజీవమైన ధర్మం. అధికార ప్రవాహములా (జీవనదిలా) రాచబాట లాంటిది. దానిపై ధైర్యముగా పయనిస్తూ ప్రజలు తమ గమ్యస్థానం పొందగలరు. ఇతర కాలువలన్నీ ఎండి పోయినవి. దేవునిచే దృఢపరచబడిన సన్మార్గము వీడి ఇతర మార్గాలలో పయనించి మానవుడు మార్గవిహీనుడౌతాడు, కానీ తన గమ్యస్థానమును ఎన్నటికినీ చేరుకోలేడు. ఈ ధర్మానికే ఆకాశ లోకంలో కూడా మద్దతు, సహాయము ప్రాప్తించియున్నవి. ప్రస్ఫుటమైన 'వహీ' (దైవవాణి) కాంతి హితోపదేశం దీని వద్దనే కలదు. దీనితో పాటు నీలాంబరముతో దీని బంధం ఎన్నడు తెగిపోలేదు. దివ్యఖుర్ఆన్ వాక్యములు ఈ సత్యమునకు సాక్షిగా నిరాటంకంగా చేరవేస్తున్నవి.

**"మా కొరకు తీవ్రప్రయత్నం చేసేవారికి మేము మా మార్గాలను చూపుతాము, నిశ్చయంగా అల్లాహ్ సజ్జనులతో** పాటే ఉంటాడు." **(అల్ అన్‌కబూత్- 29: 69)**

**"ఋజువైన మార్గం అవలంబించిన వారికి అల్లాహ్ ఋజు మార్గావలంబనలో వృద్ధిని ప్రసాదిస్తాడు". (మర్యమ్ - 19 : 76)**

దైవ కారుణ్యం ప్రపంచంలో సత్యపథగాముల కొరకు తన పరిధిని సంకోచించదు. అది సత్యమార్గంలో నడిచే ప్రతి వ్యక్తిని సాఫల్యమార్గం వైపునకు

నడుపుతుంది. వినబడని స్వరముతో వారిని సత్కార్యములను స్వీకరించమని దుష్కార్యములను విడనాడమని హితవు గరుపుతుంది. వారి ఎదుట సన్మార్గ మును తెరుస్తుంది, అగోచర రీతిలో ఎల్లప్పుడూ వారి అవసరాలను తీర్చు తుంది. మరిదంతయు ఈ భౌతిక ప్రపంచంలోనే జరుగుతుంది.

**"ఇక అల్లాహ్ మాటను అలకించే వారిని, ఆయన శరణు వేడుకునే వారిని అల్లాహ్ తన కరుణతో తన** అనుగ్రహంతో కప్పివేస్తాడు. వారికి తన వైపునకు వచ్చే ఋజుమార్గం చూపుతాడు". (అన్నిసా–**4 :175**)

19. ఇస్లాం ఒక గీటురాయి వంటిది. దానిపై మనము ఏదేని మత భావనలను, ఆచరణలను పరిశీలించి చూడగలము. తద్వారా అవి ఎంతవరకు సత్యానికి చేరువగానున్నవో లేదా వాటిలో ఏ మేర అసత్యం మేళవింపు జరిగి నదో తెలుసుకోగలము.

20. మరి ఇది కలుపుగోలుతనం లేని (రసహీనమైన) తాలిమి భావనలను పొందని ధర్మమేదో కాదు. ఈ ధర్మం రసహీనం ఎలా కాగలదు? వాస్తవానికి దాని మూలం దైవజ్ఞానం మరియు దైవప్రేమలపై నున్నది.

ఇలా సెలవియ్యబడినది.

**"మీలో ఎవరైనా ఇస్లాం ధర్మం నుండి వైదొలగిపోతే (పోవచ్చు). అల్లాహ్ ఇంకా ఎంతో మందిని సృష్టిస్తాడు. అల్లాహ్ వారిని ప్రేమి స్తాడు. వారు అల్లాహ్‌ను ప్రేమిస్తారు." (అల్ మాయిద – 5 : 54)**

**"కానీ విశ్వాసులు అన్నిటికంటే అధికంగా అల్లాహ్‌నే ప్రేమిస్తారు". (అల్ బఖరా – 2 : 165)**

ప్రేమ ఎన్నడూ కలుపుగోలుతనం మరియు ఆర్ధత లేనిదిగా ఉండదు. ఈ ధర్మం కలుపుగోలుతనం కళావిహీనంగా లేదు అనడానికి ఒక స్పష్టమైన, ప్రత్యక్షమైన సాక్షి స్వయంగా దివ్య గ్రంథమైన ఖుర్‌ఆన్ ఉన్నది. ఇది సర్వ మేళనం గల గీతము తన స్వరమాధుర్యం ప్రకారం సాటిలేని గ్రంథం.

ఇది అల్లాహ్ ప్రత్యేక అనుగ్రహం. ఆయన ఇస్లాంనే సర్వమానవాళి ధర్మం (జీవిత విధానం)గా నిర్ణయించాడు. దీనికి వ్యతిరేకంగా ఏదైనా ఉంటే అది ధర్మమే కాదు, అధర్మము. దానికి దైవ సమక్షంలో ఎన్నటికీ స్వీకార యోగ్యత నిస్సందేహంగా లభ్యంకావు.

**"ఎవడైనా ఈ విధేయతా విధానాన్ని (ఇస్లామ్) కాక మరొక మార్గాన్ని అవలంబించదలిస్తే, ఆ మార్గం ఎంత మాత్రం ఆమోదించబడదు." (ఆలి ఇమ్రాన్ – 3 : 85)**

21. ఇస్లాం అనుయాయులు (ముస్లిం సమాజం) నాయకత్వ బాధ్యతలను పొందియున్నారు. దేవునివైపు నుండి వారికి దాని అనుమతి (రీబిదీబీశిరిళిదీ) లభించియున్నది. కావున దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉన్నది :

**"ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపటానికి, వారి సంస్కరణకూ రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే". (ఆలె ఇమ్రాన్ - 3:110)**

**"ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక "మధ్యస్థ సమాజం"గా చేశాము. ఇకపై మీరు సమస్త మానవ జాతికి సాక్షులుగా ఉంటారు. ప్రవక్త (స) మీకు సాక్షిగా ఉంటాడు". (సూర అల్ బఖరా – 2: 143)**

హదీసు(ప్రవక్త ప్రవచనం)లో కూడా విశ్వాసులను సంభోధిస్తూ ఇలా సెలవియ్యబడినది :

"మీరు సౌలభ్యాలను కలుగజేయడానికి పంపబడ్డారు. కాఠిన్యతను చూపేవారిగా పంపబడలేదు." (బుఖారీ)

దైవం, ఆయన ప్రవక్త(స) వారి తరఫునుండి ఈ అనుమతి (sanction) ఈ నిర్ధారణ (Confirmation) ముస్లిం సమాజానికి మినహా మరే ఇతర జాతికి లభ్యం కాలేదు. మరి ఇప్పుడు మీరే స్వయంగా అర్థం చేసుకోగలరు. దైవ సమ్మతి లేని ఏ వ్యక్తిత్వాలైతే మానవుల ధార్మిక మార్గనిర్దేశన చేయగలిగే దావాదారులుగా హక్కును చెలాయిస్తున్నారో వారి వ్యవహార సరళి ఎంతగా శిక్షార్హమైనది. ఇటువంటి వారు స్వయంగా వాస్తవాన్ని పొంద లేదు. ఇతరులను కూడా సత్యాన్నుండి దూరంగా ఉంచాలని భావిస్తున్నారు.

